ములు పదేపదే ఘోషించుచున్నవి. ఆ నిర్వికారబ్రహ్మము సాక్షాత్కారమగునట్లు చేయునదియే మతము! దానినే ప్రతివాడును అనుసరింపవలెను. ఎవడు సర్వాతీతసత్పదార్థ మును సాక్షాత్కరింపజేసికొనునో, ఎవడు స్వతత్త్వమునందే ఆత్మను ప్రత్యక్షము చేసికొనునో, ఎవడు భగవంతుని ముఖా ముఖిని చూచునో, ఎవనికి సర్వమునందును బ్రహ్మము మాత్రమే కాన్పించునో, అట్టివాడే ఋషి. నీవు అట్టి ఋషివిగా మాఱువఱకును నీకు మతమనునది లేనట్లే! అప్పుడు మాత్రమే మతము ప్రారంభము కాగలదు. అంత వఱకు జరుగునది మతము కొఱకై సన్నాహము మాత్రమే. ఈ సన్నాహము పూర్తియైనగాని మతోదయముకాదు. ఇప్పుడు నీవు బుద్ధివ్యాయామమును, శారీరకవ్యాయామమును మాత్రము పొందుచున్నావని అర్థము.

"మోక్షమునుగోరు ప్రతివాడును ఋషిత్వ దశను సాధింపవలయును; మంత్రద్రష్ట కావలయును; ఈశ్వరసాక్షా త్కారము పొందవలయును" అని మన మతము వివరము గను సుస్పష్టముగను విధించుచున్నది. 'మోక్షము' అనగా అట్టిది! మనశాస్త్రములు విధించు ధర్మమదియే! మన శాస్త్రములను మనము స్వాయముగా పరిశోధింపవలయును; స్వాయముగా వాని అర్థమును గ్రహింపవలయును; మనకు కావలసిన దానిని విచక్షణచేసి మనంతట మనమే సత్యమును గ్రహింపవలయును. ఇదియే చేయవలసిన పని. ప్రాచీన ఋషివరులు సాధించిన మహాకార్యములను తలంచి వారియెడ మనము పూజ్యభావము చూపవలయును. ఈ పురాతన

ఋషులు చాలగొప్పవారు. కాని మనమువారికన్నను గొప్ప వారము కావలెను. వారు పూర్వకాలమున ఘన కార్యము లను సాధించిరి. మనము వానిని మించిన ఘనతర కార్యము లను సాధింతము. ప్రాచీనభారతదేశమున వందల కొలది ఋషులు ఉండెడివారు, మనకును లక్షలకొలది ఋషులు ఏర్పడుదురు—ఏర్పడి తీఱుదురు. ఈ విషయమును మీలో ప్రతివాడును ఎంతత్వరగా, గాఢముగా విశ్వసించునో, భారత దేశమునకు అంత మేలుకలుగును! ప్రపంచమునకు అంత శ్రేయస్సుకలుగును! మీరు దేనిని విశ్వసింతురో అదిగా మీరు మారెదరు! మీరు ఋషులమని విశ్వసించినయెడల, రేపే మీరు ఋషులు అగుదురు! మిమ్ము అడ్డుపెట్టునది లేనేలేదు! చూచుటకు పరస్పరము విరుద్ధములుగా నుండి, ఒకదానితో నొకటి పోరాటములు సలుపుచుండు మన సంప్రదాయము లన్నింటికిని సమముగా వర్తించు సిద్ధాంత మేదేని కలదేని, అది 'సమస్త తేజోవైభవము, శక్తి, పవిత్రత, ఆత్మలో ఇదివఱకే కల'వనెడు సిద్ధాంత మొక్కటే! శ్రీరామానుజాచార్యుల సిద్ధాంతప్రకారము ఆ జీవాత్మ ఒక్కొక్కప్పుడు సంకోచము పొందుచు, ఒక్కొ క్కప్పుడు వికాసముపొందుచుండును. శంకరాచార్యుల సిద్ధాంతము ప్రకారము అది భ్రాంతిలో పడును. ఇంతియే భేదము. ఈ భేదము లుండిన నుండనిండు. వ్యక్తరూపమున గాని, అవ్యక్తరూపమునగాని, జీవాత్మయందు శక్తి గలదనెడు సత్యమును అందఱును ఒప్పుకొనుచున్నారు. మీకు దీని యందు ఎంత త్వరలో నమ్మకము కుదురునో, మీ కంత

శ్రేయస్కరము! మీలో సర్వశక్తి యున్నది! మీరు చేయలేనిది లేదు! లేనేలేదు. ఆత్మవిశ్వాసము వహింపుడు! దుర్బలురమని నమ్మబోకుడు! వెడగులమని భావింపకుడు. మీకు ఎవరును దారిజూపనక్కరలేదు. మీయంతట మీరే దేనినైనను చేయగలరు. మీయందు సర్వశక్తి యున్నది! లేచి నిలబడుడు! మీయందు నిగూఢమైయున్న దివ్యతేజమును ప్రకటింపుడు!!



# తప్పొప్పుల పట్టి

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 3 | సిద్ధాంతములే | సిద్ధాంతములే |
| 16 | 22 | చెప్పవలసి | చెప్పవలసి |
| 24 | 4 | భిన్నభిన్న | భిన్నభిన్న |
| 135 | 16 | కలిగిన్పుడు | కలిగినప్పుడు |
| 137 | 24 | Barrows) | (Barrows) |
| 150 | 3 | 'ఒక్కరమే.' అని | 'ఒక్కరమే' అని |
| 151 | 22 | దేవతలందును. | దేవతలందును, |
| 173 | 18 | ఖేత్రిమహారాజు | ఖేత్రిమహారాజు |
| 246 | 10 | వారికం.టె. | వారికంటె, |
| 261 | 1 | పలసినదే | వలసినదే |
| 289 | 4 | యాంతి | యాన్తి |
| 318 | 10 | గోచరింనును | గోచరించును |
| ,, | 11 | జీననమంతయు | జీవనమంతయు |